# పర్జన్యము



గ్రంథకర్త :
కవికోకిల, కవితావిశారద.
జ్ఞానానందకవి.

# భూమిక

సాహితీబంధువులారా !

నా పాఞ్చజన్యము ఘోషించినది. 'ప్రభంజనము' హోరెత్తించినది. ఇక నీపర్జన్యమేమి సేయునో ?

క్షుభితమానవభువనములో స్వైరవిహారము సాగించుచున్న కటికదరిద్రదేవతా ప్రచండఘాతికాగలేక, తూగలేక, సోలి తూలి సంతతగ్లానిచే నీరసిల్లిన మానవమహనీయ మూర్తుల మహాక్రందన ధ్వానాలను సమాజప్రతినిధిగా కవి భగవంతునికి నివేదించిన, భావసంగ్రథన మీ 'పర్జన్యము'.

రసహీనుడైన కృతిభర్త మోసమునలన చితికిపోయిన కవి, ప్రజారాజ్యములో కడగండ్లు పడుచున్న గండుపేదల దీనాలాపములు, ధనమదాంధతను, భుజదర్పమునూపి నిక్కుచుండిన ధనేద్యులవల్లమాలిన యహంకార చిత్తప్రవృత్తులు, కార్మికజనముల దుర్భరజీవితాలు నివేదించి భవిష్యద్భారత రాజ్యలక్ష్మి పురోగమనస్థితి కెవ్విధమైన నిరోధములున్న వానిని తొలగించి ప్రపంచచరిత్రలో భారతజాతిప్రతిష్ఠ పరాకాష్ఠ చెందునటుల చేయవలెనని కవి దేవదేవునికి నివేదించునుతన్ని వేదన మీ 'పర్జన్యము'.

నిరాశానిష్ప్రహగాఢధ్వాంతబంధుర జీవనములోమునిగి పోవుచున్న లక్షలాది భాగ్యహీనజనముల కనులార తిలకించిన

కవికి మనస్సుకలగి నలిగినది. ఏమిచేయును? నిస్సహాయుడు, నిట్టూర్పువిడిచినాడు. మానవజగత్తున కాధారభూతుడైన భగవంతుడు సాక్షాత్కరించినాడు. స్వార్థమైనను తనదేశమును రక్షింపమని విజ్ఞప్తిచేయ పెదవివిప్పినాడు. పెదవినుండి వెడలిన దయనీయము లైన పలుకులీ 'పర్జన్య' రూపము దాల్చినది.

ఈపర్జన్యము మహాంధ్రుల యనంతాభిమానముల జూఱగొనఁగలదని తలంతును.

జ్యోత్స్నాసద్మము,
1—3—59.

జ్ఞానానందకవి.



ఆంధ్రప్రదేశ్ ప్రథమ ముఖ్యమంత్రి
గౌరవనీయ శ్రీ నీలము సంజీవరెడ్డిగారు.

# అంకితము



దీక్షాకంకణమున్ ధరించి నిజమాతృక్ష్మా స్వతంత్రేచ్ఛాసం
రక్షారూఢమతిన్ మహోత్సుకత సంరంభింపగా బాపుజీ
అక్షయ్యంపువచస్సుఁ దేలిన విశాలాంధ్ర క్షమాభాగ్యముల్
సాక్షాత్కారముఁ జెందు నీవలన శ్రీసంజీవరెడ్డ్యగ్రణీ!

అసహాయోద్యమదివ్యదాశయ మహాయజ్ఞమ్ముగుండాన, దూ
కి సుఖశ్రేణికి దూరమైయెడదలో గీల్కొన్న స్వేచ్ఛా సము
ల్లసితోద్భావనకున్ జోహారులిడి వాల్లభ్యమ్ముఁ గన్నట్టి నీ
కు సుదీర్ఘాయువులన్ విరించి యిలనిచ్చున్ ముఖ్యమంత్రీశ్వరా!

నీదక్షత్వము సాటిలేనిదయి గాంధీప్రేమ సిద్ధాంతి వా
క్యాదర్శమ్మయి యీప్రజాప్రభుత మర్యాదాస్థమై మానవా
మోదమ్మై నిలుచున్ నిరంతరము నీపుణ్యమ్ముపండెన్ యశః
పాథోధీ! తెలుగమ్మ నీబహుముఖప్రజ్ఞన్ బ్రశంసించెడిన్.

పొదలెనిచ్చట నన్నపోతరెడ్డి క్ష్మాపు
ప్రాపున నెఱ్ఱన్న వాఙ్మయమ్ము
తిరిగిచే నిచ్చట కొమరగిరి రెడ్డీంద్రుని
కలమున నాటకగ్రంథ మొండు

విలిచె నిచ్చట ననవేమభూపాలుండు
కవిరాజ వాక్యవైఖరిని మెచ్చి
వినిచె నిచ్చోట వేమనయోగి ధార్మిక
భాష్యమ్ము భావి సంప్రవచనమ్ము
మున్ను రెడ్డివరులుఁ గొన్నట్టికీరితి
నిగ్గులోనఁ దులము తగ్గకుండ
పూర్వ రెడ్డి నృపులవోలె మహాంధ్రమ్ము
నేలు నిన్ను, శుభము లేలు నిన్ను.

భుజియించితివి స్వీయ భువనస్వతంత్రమై
నలుగుచు బందికానాల బువ్వ
త్యజియించితివి స్వరాజ్య స్థాపనార్థమ్ము
సముదుగ్ర సత్కాళాశాల విద్య
సృజియించితివి మహాంధ్రికి వినూత్నమైన
శుభలక్షణంబైన సోయగమ్ము
వెలిగించితివి తపస్విశ్రేష్ఠుడగు గాంధి
శాంత్యహింసల ధర్మసారదీప్తి
సవ్యఘణితినడర నడిపించితివి నీవు
ప్రాజ్యతరపు టాంధ్రరాజ్యరథము
మొక్కవోని నీదు మోహనాక్షరములు
నిలుచుగాక సతము తెలుగునేల.

గురుతరమైన బాధ్యతలకుఁ నడుమున్ బిగియించియాత్మదే
శరమ విశాలకార్యపిఁ బ్రశస్తివహింప ప్రణాళికల్ నిరం
తరము నొనర్పసాగిన ప్రధాని! మహాంధ్రము నిన్నువంటి కొం
దరి నిలఁగన్నదాట సుఖతల్గడు తంపరలై చెలంగెడిన్.

ఆరయ తేరగా పదవులబ్బునె? యెంతటివానికైన నీ
ధారుణిలో నొకండెపుడో తానుఘటించిన పుణ్యకార్యపుఁ
గారణముఁ గదా పదవిఁగాంచుట నీకును పూర్వజన్మ సం
స్కారమువల్లనే కలిగెగా సచివత్వము రెడ్డిభూవరా!

ఈ నాగార్జున సాగరంబొకటి రెడ్డీంద్రా! ధరామండలిన్
నీ నామమ్మును నిల్పజాలఁగలుగుఁ నీభావసౌందర్యమాం
ధాత్రిన్ బొల్చెడి నిట్టిరూపమున, కృష్ణావాహినీభామ కం
ఠానన్ గల్గు ప్రసూనదామము దిగంతఖ్యాతిఁ జేకూర్చెడిన్.

క్షమ లేని జీవన కష్టాల యురులలో
బ్రుంగిపోయెను నా ప్రభూత కవిత
ఆలంబశూన్య ప్రజానీకమార్గాన
పొలసాడె నా కళామోహనాంగి
అనసూయ లేని విద్యాపారగుల దివ్య
వాణిలో నలిగెనా భావలక్ష్మి
కర్మఠులైన పింగళిగాండ్ర మోసంపు
టురులలోఁ జిక్కె నా పరమధిషణ

సమతగుఱిచి చెప్ప స్వామిభావనములో
లేదుచోటు నా కళాధిరమకు
నిక్కముగను నేటి నీయేలుబడిలోన
ప్రకటితమ్ములగుత సకలకళలు.

తొలి నాంధ్రక్షితినేలు రెడ్డినృపసందోహమ్ము సత్సాహితీ
కళకున్ జేసిన దొడ్డసేవను వినంగా మై గగుర్పాటుఁ జెం
దు, లసత్ గౌరవచిహ్నముల్ మఱలఁ జెందుంగాక నాంధ్రానసీ
వలనన్ నీలము వంశహేళి! మృదుభావా! ముఖ్యమంత్రీశ్వరా!

నరములన్ దెల్గు నెత్తురుపాఱ గొంతెత్తి
ఆలపించితిని మహాంధ్రగీతి
అప్రియత్నంబైన యనుభూతివల్లను
పఠియించితిని క్రీస్తు పరమవాణి
ఒకమహాశక్తి నన్నూతలూగింపఁ
గల్పించితిని ఖండకావ్యకృతుల
గురుకటాక్ష శ్రీల కొన్ని లక్షణములు
గ్రహియించితిని కావ్యరచనసేయ

ఈశ్వరాజ్ఞవలన నీపండిత పదవి
భృతికి మూలమయ్యె రెడ్డినేత
సాహితీ తపస్సు సాఁబాలు నీకిత్తు
నీయశమ్ములోన నేనునిలుతు.

నా 'పర్జన్యము' కావ్యకన్యక! యనంతస్నేహసౌశీల్య గా
ఢపావిత్ర్యముఁ గల్గు నాంధ్రికుల కాంతారత్నమున్నేడు, భా
షాపారీణుల నిండుకొల్వున మహోత్సాహమ్ము భాసింపగా
నీపాణిన్ గరముంచితిన్ గొనుమ యాంధ్రీపౌలుప్పొంగగన్.

సరసులు రెడ్డిరాజుల రసజ్ఞత తేలిన యాంధ్రదేశపున్
జరితములోన సత్కవుల శక్తులు మోహనకావ్యరాజముం
జనులయి వాసిగాంచెను ప్రజాపరిపాలనమైన నేటియాం
ధ్రమున ముఖ్యమంత్రి! కవితాసతి వెల్గుత నీదుకాలమున్.

కలుగున్నీకును నీకుటుంబమునకున్ గమ్రింపు సౌఖ్యమ్ములు
జ్జ్వలమై భూస్థలిలోన నీదయిన ప్రాజాపత్యమిచ్చోట నాం
ధ్రులకున్ జేకురుఁగాక! రెడ్డి ధరణీంద్రుల్ తొల్లిచన్నట్టి జా
డలలో లాగుము తెల్గుదేశరథమున్ ఢంకాబజాయించుచున్.

సుమమృదు భావునకును నాం
ధ్ర ముఖ్యమంత్రీశ్వరునకు ప్రథిత సుదీక్షా
సుమతికి నీలము కుల ది
వ్యమణికి సంజీవరెడ్డి ప్రతిభా ఖనికిన్.

జ్యోత్స్నాసద్మము,
1–3–59

నా సమర్పించు
పర్జన్యము
జ్ఞా నా నం ద క వి.

# పర్జన్యము

కడలిరాయని మహోగ్రతరంగముల పొంగు
కవధిఁ గల్పించి యాటాడువాఁడ

గగనమధ్యమునఁ జుక్కలనెల్ల నిర్మించి
వెన్నముద్దలవోలె పెట్టువాఁడ

జననిగర్భమునఁ బుట్టినపాప నొసటిపై
భావిజీవితచర్య వ్రాయువాఁడ

గడ్డిపోచలను సింగారించి మానవా
నీకమ్రనకు నీతి నేర్పువాఁడ

భక్తనరులహృదయ వనజాల వసియించి
పేదవారిడొక్క వెలితినింపి
విశ్వవిశ్వములను వెలుగొందు మహనీయ !
ఆదిదేవ ! నిన్ను నభినుతింతు

ఘనుడు గౌతమబుద్ధముని నీతి నిలయాన
కాపురించినయట్టి కలికి మిన్న

ప్రథితశంకరుని యద్వైత కళాశాల
ముక్తిబోధనవిన్న భక్తురాలు

పర్జన్యము

బ్రహ్మచారి నరేంద్రు భాషార్ణవమ్ములో
గాహనమ్మొనరించు ఘనపురంధ్రి

అమలసద్గుణుఁడు మోహనదాసు గీతాల
భజనఁగావించిన పరమసాధ్వి

నాథ! విన్నవింతు నామాతృదేశమ్ము
భారతమ్ము నన్ను భారతీయుఁ
డండ్రు దేశభాషలందు నాయది తెల్గు;
తెలుగువాఁడ నేను దేవదేవ!

పేరొంది విశ్వపృథ్వీరంగభూమిలో
గజ్జెగట్టినది మాకన్నతల్లి

భూనభస్సులు మారుమ్రోయ శాంతిసమత్వ
మునుఁ జాటి వచ్చెమాయనుఁగుతపసి

ముజ్జగాల్ భళియన బులిపించు మతధర్మ
మెఱిఁగింప నోడిచె మాయింటివాఁడు

జననిదాస్య నిగళమునుఁ ద్రెంచఁ బ్రాణాల
నర్పించెఁ దెగువ మాయగ్రజుండు

త్యాగములకు భక్తితాత్పర్యములకును
గుణములకునుఁ గూడఁ గొదువ లేదు
కాని సర్వశక్తికల జగదీశుని
యలతి ప్రేమభిక్ష కలుగవలయు.

ఫలమో? పుష్పమొ? తోయమోయిదుటి
సంభావ్యమ్ము చర్చింప పె
ద్దలసందర్శనవేళలో ననెడు ప్రోక్తంబుల్
యథార్థంబులై
నిలువంజాలవు నాయెడ ప్రభువ; కానీ! నీకు
సద్భక్తిఁజే
తులుజోడించి మొసంగెదన్మనసు
సంతోషింపుమోయీ ప్రభూ !

మానసత్వమ్ము నాలోన మనుటవలన
జీవచైతన్యశక్తి పుంజీభవించి
నన్ను మేల్కొల్ప నేడు విపన్నజాతి
తరపుననొసంగు విజ్ఞప్తి దయనువినుము.

ప ర్జ న్య ము

మావిజ్ఞాపన పత్రిమందికొని సంబాలించు టేమాకునో
దేవా! వేయివరాలమూటయగు మాదేశానకెల్లప్పుడున్
శ్రీవైదగ్ధ్యముశాంతపుం బ్రతుకుఁబ్రస్ఫీతంపుభాగ్యాలు, స
ద్భావాలన్ దయసేయనిన్నెపుడు నభ్యర్థింతు సర్వేశ్వరా!

నిమిషము శ్రాంతిలేక ధరణీవలయమ్మునుఁ గాచునీదు, కా
లమునుహరింప నామనసులాగదు దుందుడుకొప్ప వ్యర్థవా
దములకుఁ దాపునీయగ ముదంపడు వాఁడనుగానునాఁడు, దే
శమునకు శాంతిసౌఖ్యముల సంతతమీయగ వేఁడెదన్ ప్రభూ!

అదిగో! యీజనపంక్తిమధ్యమున దైన్యస్వాంతుఁడైనిల్చె నా
పదకుంబట్టియినట్టిపేదసుకవివ్యాసర్షి! క్షోణీమహా
భ్యుదయార్థంబు రచించెఁగావ్యములనెన్నో నేడుఁగన్పింపడీ
బదులీయంగను లేనిదేశమున గప్పాల్ గొట్టు నాజాతికిన్

కృతులందేరగ స్వీకరించి కవులన్ దృప్తాత్ములంజేయను
ద్ధతులై నిక్కుచునిల్చుచుండెడి ప్రబుద్ధశ్రేష్ఠులున్నారు శా
శ్వతభాస్వద్యశముంగడింపగఁ దలంపంజూచుచున్నారు కాం
చితివా? వారిన్న్యాయమిమ్ముమటి సచిత్తమ్ము మాభాగ్యమా.

తనజాతీయుల భావముద్రికలు స్వాంతంబందు బింబింప,నూ
తనమర్మముల నాకళించుకొని యాత్మప్రేరణమ్మున్ బ్రవ
ర్ధనమున్ జూపి సతమ్ము నాటక కళారంగమ్ములోఁ జేసుఁబొం
దిన వైశిష్ట్యముఁ గల్గు నాటకులు తండ్రీ! వారినీక్షింపుమా.

ఈబక్క మనిసిఁ జూడుము
బాబూ! మూన్నాళ్లనుండి పస్తులువడి తం
డ్రీ! బలవన్మృతిఁ బొంద గ
గాబరపడుచున్న యట్టి కార్మికుఁడకటా!

యజమాని యడ్డదమ్ముల
ధ్వజపుంజాయలవసింప తగదని తానై
భజనలు సేయఁడు కావున
గజబిజఁ జేసెను దరిద్రకాంత విభువరా!

ఉల్లాసానఁ గబుర్లఁ జెప్పికొని యేవోరిత్త వాగ్దానముల్
వల్లింపన్ శ్రిమవడ్డ వేత్తలను దేవా! కాంచితో దేశమే
కల్లోలంబయి భిన్నభిన్నములుగాఁ గన్పట్టెఁ బోజల్లెడన్
నీల్లుంబోసిన చందముండుటను తండ్రీ! మేనుబజ్జంచెసెన్.

పర్జన్యము

చెమటబిందువులోడిచి చింతపడక
స్వార్థరహితమగా జీవనయాత్రసలిపి
పరులకుపకార మొనరించు వాడతండు
ఆర్షసంప్రదాయ మెఱుంగు కర్షకుండు.

ఆలుంబిడ్డలతో క్షుధానలముతో నల్లాడి దేహమ్ముబల్
తూలన్‌గన్నులు లొట్టవోవ దనవిధ్యుక్తంపు ధర్మమునన్
స్కూలుంబిల్లల నీతిపాఠములతో గుంఫించుచున్నట్టియా
బోళావాడు ప్రభూ! యతండెఱుగు నీపూజాపురస్కారముల్.

జననికిస్వేచ్ఛనీయగల జాగృతిలో గుజరాతుమౌనియా
దినపెను పాంచజన్యపు ప్రతిధ్వనివించునతండు దేశమా
తనువిడిపింపవచ్చిన యుదారమహాశయుడైన త్యాగి యా
తనికి భుజింపబువ్వనహి ధర్మమదెట్టులసాగునే ? ప్రభూ!

స్వామి! యితడు దండిసత్యాగ్రహమ్ములో
కరముచందు గాంధిగారి యడుగు
జాడలోన నడచినాడు నేడితడు
చితికిపోవునట్టి బ్రతుకు బ్రతుకు.

వానకు నాని సూర్యునితపమ్మునమ్రగ్గి నిరంతరవ్యథా
గ్లానిసహించి జీవితము కాఱుమొగిళ్లనలెదలంచి, గి
ఞ్ఞానుకరానఁబూను పనిగానికి నిత్యమెడారిజీవితం
బైన తదీయజన్మమున కర్థమదేమి? వచింపవా ప్రభూ!

జరుగలేదన్న జహ్వాయపండితుఁడుఁ గోరు
వక్రిమ్ముకాని కార్యక్రమమ్ము

నిండలేదన్న కందినడెందమున్నట్టి
బక్కచిక్కిన పేదవానిడొక్క

తగ్గలేదన్న వందలప్రణాలికలున్న
నున్నతంబౌ నిరుద్యోగబాధ

పొలియలేదన్న యభ్యుదయమ్ము ఖండించు
కలుషితంబైనట్టి కులపిశాచి

భువినిక్రిమ్మ లేదు భువనమోహనమైన
కర్మయోగిగాంధి మర్మవాణి
చేతులెత్తి పూజసేతునో దేవరా!
ఇందుఁబద్ధనావలయు నింత లేదు.

పర్జన్యము

అనఘా! యెవ్వఁడు చేసెనో తెలియదీ యస్పృశ్యజాతిన్ గనుం
గొన వేదమ్ములలో లిఖింపబడెనే? న్యాయమ్ముఁ గల్పించి నీ
తినిఁ బోఁగొట్టినవానిపై నితఁడు కుస్త్రీ బట్ట నుంకించియా
తనిపై వ్యాజ్యము నేసె వర్ణముల వ్యత్యస్తమ్ము రూపించుమీ.

ప్రవహింపవలె హైందవక్షేత్రమందెప్పు
డమలకారుణ్య గంగామృతమ్ము

చరియింపవలె సర్వభరతకాశ్యపినంత
మహితమహా సచ్ఛాంతిమారుతమ్ము

నివసింపవలె గాంధి భువనానచిరముగా
శర్మప్రదాయిని ధర్మదేవి

వెలయింపవలె కులకలహాల దేశాన
పాపభంజక దయాదీపకళిక

పరిమళింపవలెను పావనభ్రాతృత్వ
భావకుసుమరాజి భారతమున
కరుణగల్గుగుండెఁ గలవారిఁగనుఁ జేయ
నాథ! నీకు ప్రార్థనమ్ము సేతు.

తరములుదాటి సంఘమునఁ దావిసుమంతగణించుకొన్న యీ
యిరువురు మాలమాదిగలె యీసులురాసులుఁగాగఁ బెంచికొం
దురు పదవీవిమోహమునదోషము లేశములేనివాని నీ
వెలుగుదు వేనుఁ జెప్పఁబని యేమిప్రభూ! తిలకించుమా పయిన్

అవని నేడు మొలిచె శివమెక్కు సిరికథల్
హరికథాళి మఱియు శిరసుకథలు
కవితకింత దిక్కు కానంగరాదయ్యొ
చెప్పికొనఁగనిదియ సిగ్గుచేటు

నాప్రక్కంగలవానిఁగంటివె? జగన్నాథా! సజీవాంధ్రభా
షాప్రాగల్భ్యవిముగ్ధమోహనసుధా సామ్రాజ్యసంధాత! ది
వ్యప్రామాణ్యముఁగల్గు వాక్పతినిఁ గాపాడంగయత్నించుమన్
నీప్రాపున్ మదిఁగోరివచ్చెనికఁ దండ్రీ నీదెభారమ్మికన్.

ఋతమునచింతునీవు సెలవిమ్ము నమస్సులు మంచిచెడ్డలెం
చితొడమసత్కవీంద్రులకుఁ జెప్పగ గౌరవమన్నసున్న యీ
వితమున సాహితీరమకు విశ్వజనీనత సంభవించునే?
యతికినిప్రాసకుంగలుగు నైక్యముఁగావలెగాదె? యీశ్వరా!

పర్జన్యము

ఈపృథగ్జనునకు హ్రీలేదుధీలేదు
రసముసృష్టిఁజేయు ప్రజ్ఞలేదు
తానుకవినని మొనగానిగాఁదలచును
పేడిమూతి వెట్టివెంగళప్ప

లోకజ్ఞానమునాస్తి దొడ్డగుణమాలోపమ్ము పాండిత్యమా
ఆకట్టైనిలుచుండు భావముపదాలంకారముల్ పూజ్యమా
ధీకుల్ మెచ్చని శబ్దజాలములహత్తించున్ వృథాకావ్యమం
దీకాలుష్యమనస్కు మెచ్చడొరుఁదండ్రీ! వీనినీక్షింపుమీ.

ఈపథ్యాలో తిలక్ ఏగినాడొకవేళ
అదినేడుఁ గనగచ్చపొదలకిక్క

ఈసాలలో మొన్న గోసాయి యలగాంధి
నిలిచె నేడదియు గబ్బిలప్పుకంపు

ఈరంగముననాడు నృత్యమ్ము ధర్మదే
వతసల్పె నదియు గప్పాలదిబ్బ

ఈరాజ్యపాలనం బారాధ్యమానాడు
నేఁడుబూడిదను పన్నీరు పోత

పులకరించెవాస నలమూలకమ్మున
అందమైననాటి నందనమ్ము
నిమిషముండలేము నేడు దుర్గంధమ్ముఁ
గొట్టు నీవదియరికట్టుమన్న!

పైకినటించు గాంధిమునివారసుబోలె స్వతంత్రభారత
శ్రీకి నతండెకర్జమని చిందులుఁద్రొక్కి బడాయిఁగొట్టి యీ
లోకము కన్నుఁగప్పి యిసిరోజతనమ్ములు సేయుచున్న యీ
లౌకికమూర్తిఁ జూడుమపరాత్పర! గుండెలు దద్దరిల్లెడిన్

రాటమ్మూని మహాత్మగాంధి పెనుపోరాటానసచ్ఛాంతి ఘం
టాటంకారము మారుమ్రోగెను లసన్మాన్యప్రభోద్దామ వి
ద్యాటోపమ్ములు రాణఁజెందినవిస్వాతంత్ర్యమ్ము సిద్ధించె ను
ద్ఘాటింపం బొరపొచ్చెముల్ బలిసెఁ జక్కంజేయ నర్థించెదన్

అనభిజ్ఞుల్ మతిమాలిపల్కెదు రగ స్వభ్రాతృసంబంధులై
గుణముల్ గల్గినచోట తప్పులని తక్కంజోట్ల నొప్పించు నీ
సునమూఢత్వము పెచ్చుమీరిన మనస్సుల్ గల్గు ఛాదస్తులన్
గనినావా? యిదిగో సుదూరమునను న్నారయ్య వీక్షించుమీ!

పర్జన్యము

మృత్స్నాసమానమైనది శరీరమటంచు నుపన్యసించి త్వా
కృత్స్నఁ మిత్రమై యొరులకెప్పుడు వంచనసేయుచోఁ గళా
జ్యోత్స్న శుభోదయంబగునె? జొబ్బిలునే? కవితాస్రవంతి, యే
మృత్స్నఘటించ జాలక సదృష్టముఁగల్గు వచింపవా? ప్రభూ !

మానట్టింటను జన్మమెత్తినది శుంభచ్ఛారదా దేవతా
శ్రీనవ్యోదయ భావవాహిని, రసశ్రీధిష్ణ్యయంచాడి యే
వో నాదమ్ములసల్పి జీవితము నేదోమార్గముంబుచ్చ నీ
ప్రాణైష్కర్మ్యములఁగాంచితో ప్రభు! మనస్తాపంబుఁగల్గించెడిఁ

చరియింపరాదు గర్జన సల్పినాసీమ
నదయకీల్లైన పంచాననమ్ము

భుజియింపరాదు భూములు లేని నిలువేప
సాపాటు నధికారజంబుకంబు

శబ్దించరాదు దౌర్జన్యదేవత కరా
ళక్రూరఘోరపర్జన్యఘోష

కనిపింపరాదు సంఘమును ముక్కలుసేయు
పక్షపాతస్వాంతలక్షణమ్ము

చివురులెత్తరాదు వివిధవర్గములలో
స్వీయమైన రాజకీయరభస
దేబెరించుబ్రతుకు దేశానఁ బోఁగొట్టి
ప్రేమశాంతిభిక్ష పెట్టుమన్న!

కారులమీఁదఁజోరుగ షికారులు పారుచుఁ బచారుసల్పిశృం
గారముకోసమై ధనముఖర్చు నొనర్చి మహాత్మగాంధికిం
పారు స్వదేశపున్ ఖదరుబట్ట ధరించినటించుభక్తుల
వ్వారలు రంగుమార్చిన జవానులఁగన్న నిజమ్ము తేలడిన్

ప్రతిభాశాలి యతండు దేశమునకై ప్రాణమ్ము నర్పింపను
స్థితినిన్వీడి యెదిర్చెశాత్రవుల సిద్ధించె స్వారాజ్యమ్ము దు
స్థితికిఁ బాల్పడినాఁడు, నేఁడుపదవీ సింహాసనమ్మందు సం
స్థితులైనట్టి మనుష్యుఁడీతని సమర్థింపండు వాచింపగన్

మొన్నటిదాక వానికిలబువ్వభుజింపగలేదు నాఁడుప్ర
క్కన్నిలయమ్ముఁ గట్టుకొని కాపురముండెను నేఁడువాఁడుసం
పన్నుఁడు వానివానిమఱి వానిపదమ్ముల నాశ్రయించి నే
డున్నతి నున్నవాఁడు కనవో వినవో జగతీవిహాస్యముల్

# ప ర్జ న్య ము

అదిగో! చదువులో నాజూకుఁ బొడుగుకొన్న
ముగ్ధయొక్కర్తు తనదారిఁబోవుచుండ
లొట్టలను వేయు యువకుల జట్టుగనుమ
ఆర్షభారతమందు మర్యాద నేడు

రాజకీయముల పరాయిరాజులవల్ల
స్వామి! వానివెన్ను వాచిపోయె
బాధితుండువాడు వానిజాగనితండు
పంచుకొనగనిల్చె ప్రభువ! నేడు

ఈలంచాలమహాపిశాచి జలగై యీ దేశముంబీల్చగా
వాలాయమ్మున సాగుచున్నయది త్రావనల్ల పేదప్రజా
పాళింజూడుమ సర్వముం దెలియు దేవా! యిట్లిపోనిచ్చుచో
నేలావణ్యము లెట్టి పొందులిట తండ్రీ! నిల్చుఁ బ్రశ్నించుచో.

వేండ్రింబైన మనస్సుతోఁ గుమిలి యీవిశ్వమ్ము శ్రేయమ్మొదన్
దీండ్రింపన్ దనదేహమిచ్చుముని గాంధీ దేశమం దేకనన్
గోండ్రింపుల్ గికురింపులున్ మఱియు పెఁ గోండ్రింపు గాండ్రింపు
లున్
తండ్రీ! సిగ్గగు సెప్పుచో నెటుల సంధానించెదో నెయ్యమున్.

పర్జన్యము

మానవజీవితమ్ము సుఖమా! కనుమీబికిరాలమారిపెం
పూనరసప్రపంచమున నూపిరి తీయగనీడలేక దుః
ఖానులదగ్ధమూర్తులయి యారటమందుచునున్నవారల
న్నా! నిన్ను మొక్కుకొందు నవనాయముదిద్దగ నిన్నుఁగోరెదన్

నారాజ్యమ్ము ప్రజాప్రభుత్వమగుటన్ గంటిన్ క్షుధారాజ్యమం
చీరాజ్యమ్ము ప్రజాస్వరాజ్యమనినాహిందూప్రజల్ పల్కుటల్
నారక్తమ్ముసహింపనేరదు జగన్మాన్యా! శరీరమ్ములో
నారాచమ్ములుఁ గ్రుమ్మినట్లుగను జ్ఞానానంద సంధాయకా!

తెస్నగవిన్నచోఁ గరుణలేనికులీనులు పేదవారి న
క్కస్సునఁబెట్టు హింసలకుఁ గందనగాయచెమర్పదా? యెదో
భిస్సటదించుజీవితము వెల్తియలేకను వెళ్లబుచ్చు నీ
తొస్సెలపైని జాలిఁగొని తోరపువిన్నపమాలకింపుమీ!

తలనుదాచుకొనగ స్థలమింతలేనట్టి
పేదవారిబ్రతుకు పృథివిలోనఁ
గనుచు నూఱకుండి కారింతువో? జాలి
బఱపిపోద్రిచెదవా? కృపాసముద్ర

పర్జన్యము

నెత్తురుఁబొట్టులు ఖరుచై
సత్తువనీగించె మిత్తి సత్తువునకు నీ
బత్తుం డీతనిఁజూచినఁ
జిత్తము నీయందునిలిపి సిద్ధుడు కాడే?

భృత్యుండీతడు కూడుగుడ్డకయి తండ్రీ! వాచిపోయెన్ యథా
ర్థతకున్ జోటిసుమంత లేనిక్షితిలో దానమ్ములింపొందునే ?
గతిలేనట్టి బికారిమోములఁ గళాకాంతుల్ విడంబించునే ?
వెతలంబడ్డ దరిద్రమూర్తులకు నీ వేదిక్కు సర్వేశ్వరా!

మీసమ్మున్ మెలివైచినిల్వఁబడె గంభీరమ్ముగాఁ గాంచినా
వో, సామీ! యితడొక్కసంస్థకుమహోద్యోగీంద్రు డధ్యాస్న
పృ

వేసాల్ వేసి ధనమ్ముగుంజుకొను గర్విష్ఠుండు దేశాలలో
ఈసన్న్యాసులసంఖ్య హెచ్చినది యెట్లీ దేశముల్ బాగగున్

గండరగండడైన కవిగానికి జీవితమే యెడారిగా
నుండు రసజ్ఞశేఖరులకుండదు సొమ్ము, ధనాఢ్యులెల్లరున్
దండుగకైనొసంగెదరు నాణెములన్ దెగనీల్గుచున్ మహో
ద్దండులమంచు నెత్తిభుజదర్పముఁజూపుచునో పరాత్పరా!

ఏడుపువచ్చునన్న క్షమియింపుము చెప్పకచెప్ప వీనిదా
గోడునిజమ్ము వీనికనుగోనలజాతిన యశ్రుబిందువుల్
గూడ నిజస్థితిం దెలుపు కొండొకదెబ్బకు లొంగిపోయెన
వ్వాడు బడాయికోరు తెగవాగుడుగాడు పరీక్ష సేయుమీ!

తగినవాడెవండో? తగనివాడెవ్వండో
తెలిసికొనగలేని దేశమందు
కళలుఁగాదు బ్రహ్మకొలువుకూటంబైన
నిలువ లేదు నిలువనీయ లేదు

ఇతఁడస్పృశ్యుఁడటంచుఁ జెప్పితిగదా! యిందాకభావమ్ము చ
రిత్రమున్ జర్వణమైనప్పు తఖరా లేదన్న! తత్సంస్థకున్
బలియెవ్వండు? నిజానికీవిషయమున్ బ్రస్తావనం జేయుచో
భృతికిన్ దూరుడగున్ యథార్థముగఁదండ్రీ; న్యాయమిప్పించుమీ

ఇతడుగోచిపాత బ్రతుకు బ్రతుకుఁగాని
దేశమన్నగుండె తీవరించు
ఇతని లెక్కపెట్టరీనాటిజనములు
దంట! వీనినొక్కకంటఁ గనుము!

## పర్జన్యము

ఇదిగో! చంకనుబిడ్డ నెత్తిగొనియెంతే సిగ్గుతో నున్న యీ
ముదిశంగాంచగ గుండెబ్రద్దలగు బాబూ ! యీపెమాంగళ్య
మున్
బ్రిదలంజేసిన దుష్టభావుడగు పాపిన్నీవు సైరింపను
న్నదయాధర్మము లీప్రదేశమున శూన్యంబై వినాశంబగున్

మతముల పితలాటకముల
మతులంబోగొట్టుకొన్న మానవులెల్లన్
సతమతమగుచును శివమె
క్కితిరుగువీరినిఁ గనుమిటుఁ గ్రీగంటప్రభూ!

చిందుల్ ద్రొక్కుచునున్నవన్న భరతశ్రీగోత్రమందిప్పుడీ
విందుల్ నృత్యములట్టహాసములు నేపెద్దైనఁదిగ్గాడుచో
తందానామటి తందనానయనుచున్ ధ్యానాలు, నాజూకుకై
చందాలెత్తుట, గుల్లకట్టుట బుభుక్షాదేవతన్ దన్నుటల్.

కపటమనస్సులేని యొకకమ్మనిపూరుషు డాతడారయన్
బ్రపయగుదీనమానవుల పాలిటనేదియొ సేవఁ జేయగాఁ
దపనమునొందు నిచ్చకముదాసహియింపడు కాని యెవ్వడో
కృపణుడు మోసమున్ సలుపఁగ్లిష్టములో మునిగెన్ బరాత్పరా!

నీనిదుంప తెగ భళీ! నీతినియమాల
నిజముఁదొలగనట్టి నిండుకుండ
ఉన్నమాటపల్కు నన్న యీతనిఁగాంచి
ద్వేషగుఃఖలమూక విస్తుపోవు

మఱచితినొక్కమాటను క్షమాపణఁగోరెదనిన్ను గట్టిగా
అఱచినవానికే సుకములన్నియుఁ గూడునటంచు వింటినో
సురవర! యేమిన్యాయమిదెచూచియుచూడనియట్టులుందువా ?
కఱకుతనంపుబుద్ధిగల కర్మఠులన్ నివసింపనిత్తువా?

అమృతముఁజిందు పద్యముల నాతనిపై రచియించివాడు జీ
వమున జరామరమ్ముగను భాసిలఁజేసెనుకాని యెంతకో
ప్రముదముఁ గూర్పడయ్యెప్రతిభాయుతుడైన కృతిప్రభుండు దే
శమిటులెయున్నచోఁ గళలుఁజచ్చును దేశముఁబుచ్చిపోయెడిన్

డిగ్రిలేదను కించయేకలదు పాండిత్యమ్ములో వాడు సా
మగ్రిన్ దేశికునొద్దఁగూర్చుకొనె శుంభద్దివ్యసాహిత్య సం
ప్రాగ్ర్యంబన్నది యెన్నఁడోకలిగె నాంధ్రంబందు కావ్యాల్ రస
శ్రీగ్రాలన్ విరచించె నీదగుశుభాశీస్సుల్ ప్రసాదింపుమీ

స్వాతికి ముత్యముంబలెను వార్షిసవార్షికకుఁ గిట్టునంచు నీ
యాతనవడ్డ మానవుని యారటమున్ శమియింపఁజేయుచో
నీతడుసాగిపోవుఁ బరమేశ్వర! ముందుకు, లేనిచోఁ గళా
ధాత యితండు నీపయిని దాడినొనర్చు మనుష్యభావమున్

ఆకనుపించునాతడు మహాత్ముఁడు మోహనదాసుగాంధికే
పోకడలున్నవో యవియెబో, యతనిన్వరియించెనిందులో
నాకనుమానమింతయును నాస్తి సమస్త జగాల శంసలన్
జేకొనె నీప్రసన్నతలనింపి చిరాయువులిమ్ము వానికిన్

శ్లాఘాపాత్రముకానిదై మఱియుఁ గ్లిష్టంబై భయోత్పాతమై
మోఘంబై యభిషజ్ఞమైకిళిసటద్భాభాగమై పాపసం
ద్రాఘిష్ఠంబయినట్టి జీవితములన్ సాగించుచున్నట్టి, యా
యీ, ఘోరాత్ములకున్న దేశలము తండ్రి! స్వర్గధామమ్ములో

ఉద్యోగమ్ములకై పఠింపగను నేదోప్రొద్దుపుచ్చంగ నీ
విద్యాపద్ధతి ముప్పదైదుగుణముల్ జేరమ్మసాగింపగా
నాద్యంజ్ఞానముకల్గునే? చమవుదేశారాధన న్నేర్పునే?
విద్యోతించునె ధర్మవర్తనము లీవిశ్వంభరామంతలిన్

పర్జన్యము

ఒకనికనుఁగప్పి తిరిగివేఱొకని మంచి
చేసికొనెడు ముతాగాండు) చేయునట్టి
ఈహామేహా తమాషా పరేశ! యెన్ని
నాళ్లు జరుగవలయునో? నిర్ణయమునీదె!

నిర్మింపన్ గుడిగోపురమ్ములను క్షోణీవాసు లుప్పొంగగాఁ
దీర్మానమ్ములసేసి పేదలకుఁ గానీనైన వెచ్చింపకే?
కర్మంబందుననమ్మి వీనిఁగనదుఃఖధ్వాంతచిత్తుండ నీ
మర్మంబందునఁ గల్గుభావములగమ్యంబౌను లోకేశ్వరా!

తనకునచ్చని భావమునఁజరించినవాని
హింసించు కరుణావిహీనుడితడు

తనమాట కెదురుచెప్పినవాని శ్రేయమ్ముఁ
దలపనిదేశ బాంధవుడితండు

తనసమక్షమున స్తుతిని నొనర్పనివానిఁ
బలుకరించని దొడ్డవాడితండు

తనపాటకెప్పుడు తందానయననివానిఁ
బూర్తిగామఱచు ప్రబుద్ధుడితడు

ఆబరీకంఠమువాఁ దాల్చి యచటనిలిచి
పరమదర్పాన ప్రజలకుపన్యసించు
నట్టిజగడాలకోరు కన్పట్టుఁ గనిన
నుర్వివృక్షానికే చీడపుర్వితండు

పోలుచుఁదూలుచున్ గనులుసొట్టలువోవ నిరాశమోముపై
గ్రాలగగోచిపాత తమకమ్మునఁదాల్చి కుటుంబభారమున్
దాళగలేని పీడితజనమ్ముల పెద్దయితండు దివ్యస
చ్ఛీలుడు నొక్కకంటఁగని దేవర! చూడుమువాని నీవయిన్

విహరింపవచ్చునా? విశ్వసర్వంసహా
భానవిద్వేష ప్రభంజనమ్ము

దండెత్తవచ్చునా? నిండుభారతమున
శాంతినీయగలేని జాతరమ్ము

భుజియింపవచ్చునా? బొత్తిగానిఱుపేద
గ్రాసమ్ము స్వార్థరాక్షసులగుంపు

నటియింపవచ్చునా? నవభారతమ్మున
గొప్పచెప్పు మతాల చుప్పనాతి

ప ర్జ న్య ము

అలగవచ్చునె? చిన్న కార్యమునకైన
తొలగవచ్చునె? శాంతిపరితోళినుండి
స్వార్థమేయగుగాక దేశాలలోన
మహితసత్కీర్తి నాదేశమాతకిమ్ము

ఈసైన్సుచదువులో నేమున్నది పరిపంచ
బీభత్సమొనరించు విధముగాని

ఈయింగిలీసులో నేమున్నది జగాన
పాశ్చాత్యభావమ్ము పరిబలుగాని

ఈమేలిడిగిరిల నేమున్నది యానంగ
గడుపునిండుటకు పాల్పడుటగాని

ఈగొప్పపదవులందేమున్నది తలంప
నపహాస్యభాజనమగుటగాని

ఇవి సహింపనుమాకు తండ్రీ! నిజమ్ము
సత్యమును దయాశాంతిశిక్షణ కళాల
యమ్ము లుపకారభావమ్ములనెడు పాఠ
శాలలున్నచో నాదు దేశము తరించు

ప్రాచ్యపాశ్చాత్య విజ్ఞానభావజలధిఁ
తనవిదీళ మథించిన దక్షుడితడు
పెద్దయుద్యోగి వర్ణవిభేదజాడ్య
ములనుఁ బ్రేరేచుఁ జాటుగానిలువబడుచు

విద్యమానమందు హృద్యమహా పద్యాలు
కంటగింపు చదువుగాండ్ర కింత
వెఱ్ఱితలలువేసి బుఱ్ఱపాడొనరించు
పిచ్చివ్రాతలిపుడు వెక్కసించు

బహుమర్యాదగమాటలాడి జగతీభద్రమ్ముఁదానొక్కఁడే
రహిఁగాంక్షించినవాని చందమున దర్జాజూపివర్తించు నీ
కుహనాభక్తుఁడు వీడు మిక్కిలిదగాకోరై నిజస్వార్థలం
పుహితంబున్ మదిఁ గోరఁడెప్పుడు దయాంభోధీ! పరీక్షింపుమీ

ఖదరున్ బట్టధరించు మాత్రమున పక్కాదేశభక్తుండటం
చెదలో నమ్మినసంస్థకున్న యదె తండ్రీ! యుజ్జ్వలంబైన భా
వి దగాజీవనముంబొనర్చు మనుజుల్ పెక్కండ్రుజీవింప న
భ్యుదయంబిచ్చట జీర్ణమై చివికిపోవున్ విశ్వసంరక్షకా!

పర్జన్యము

లేవీనాడు కళాసరస్వతికి తండ్రీ! పల్లకీమోతలున్
లేవీనాడు కళాసరస్వతికి తండ్రీ! దివ్యసన్మానముల్
లేవీనాడు కళాసరస్వతికి తండ్రీ! యర్హాత్థానముల్
లేవీనాడు కళాసరస్వతికి తండ్రీ! చొక్కపున్ బూజులున్

భూదానోద్యమ దీక్షఁబూనెనిట బాపూజీ హితుండొండు తా
నాదేశించినవాక్కు బమ్మనుడియై యావత్ప్రపంచానికిన్
మోదంబున్ ఘటియించె నేటికిఁ బ్రజామోదమ్ముసంధిల్లుచో
ప్రాదుర్భావముగాదెరక్షక! క్షమావాల్లభ్యసంలబ్ధికిన్

ప్రారంభోత్సవముల్ పురాతనములో రాజన్యులున్ సేయుటల్
ఏరాజ్యమునైనఁ జూడమిక నేడీసత్తుకార్యానికిన్
ప్రారంభోత్సవముల్ ఘటిల్లుటలు సౌభాగ్యత్వమీదేశమం
దారూఢంబగునట్లుగాఁ దలచుచున్నానయ్య సర్వేశ్వరా!

అమ్మ చెల్లకచూడు వీడమ్మకడుపు
బంగరువ్వుగాను హాస్యాల పంటవీడు
వీనిజిహ్వాంచలమునుండి వెడలునట్టి
మాటమాటయుఁ గనవవ్వులాటకిక్క

సభ్యతకల్గులోకమునఁ జక్కనిజీవనమిచ్చి ధర్మవి
ద్యాభ్యసనమ్మొనర్పగ సహాయముఁ శేయమునిచ్చి దేశమం
దభ్యుదయమ్ముమోసులిడ నంజలిసల్పెదమా పయిన్ త్వదీ
యాభ్యుపపత్తికల్గిన మహాసుకృతమ్మనియెంతుమో ప్రభూ!

ప్రభువులఁ జిత్తగింపవలె వాండ్రుదరంభరి! స్వప్రయోజనం
బభముశుభమ్ములుంగని సుధామలమూర్తులఁ గష్టపెట్టి తా
విభవమునందుచుండుట ప్రవీణతకుం దగలాంఛనమ్మొ? నీ
ప్రభుతమతిట్టిదైన బడనల్ గాడనల్ బొనరింపకుందురే॥

తీయఁగఁబల్కరించి వెనుదీయనిసుండెను గౌగిలించి దీ
ర్ఘాయువుఁగోరునట్లుఁ గుశలాదులసగ్గునుపైకి యీగడు
గ్గాయి కిరాయిలేనిది నిఖాన్నగనేపనిఁ జేయలేడు తం
త్రైయగుపించు నిచ్చటమహాత్మ! జగానఁ గసంగనంతయున్

పదుగురిలోన నిల్వఁబడివాక్కును బైటకుఁజెప్పలేని సత్
హృదయముఁ గల్గునీతని నిజేప్సితమున్ వినియాదరించుచో
బ్రదుకుసమస్తవిశ్వముల బాగునుఁగోరి కితాబులెందుకో?
చదువదియెందుకో? పసులసౌఖ్యముఁగోరగలేని వేళలో

## పర్జన్యము

అతడు రంగుమార్చ పతకమ్ము వేసిన
బిజుగుకాడు గాంధియిజమువాడు
ప్రజలులోన ప్రజలుగజిబిజియైపోవ
నేనిదిసహియింపలేను తండ్రి!

జనతాసమతాకవితయు,
వినయవిధేయత విశాలవిద్వత్తు, యశో
గుణపత్త్రయు, ధీమత్త్రయు
ననుగ్రహింపుమిక భారతావనికి విభూ!

ముంచరాదెపుడు నుప్పొంగి సీమలనెల్ల
దేశానమున్న నదీనదాలు

దించరాదెపుడు దిగ్దేశాలలో వాసిఁ
జవిఁగొన్న జాతిగౌరవపతాక

త్రుంచరాదెపుడు విద్యోతించు మధురమా
గానబుపూచిన స్నేహకుట్మలమ్ము

ఉంచరాదెపుడు సర్వోర్వీతలమ్మున
పరమనాశనపు టస్త్రమెందు

పెంచరాదెప్పుడు విభేదభావమ్ములు
మంజులమ్ములయిన మానసముల
శాంత్యహింసలనెడి సన్మార్గసాధనా
లనఘ భరతదేశమునకునిమ్ము

స్వార్జచ్ఛాంత్యనురాగముల్ వసుధఁ బ్రస్ఫోటింపగాఁజేసి యం
తర్జాతీయప్రమాననీయమగు సత్కారాల నెన్నింటినో
యార్జించెన్ నెహురూప్రధానియిదిప్రఖ్యాంబిండియామాతకున్
అర్జీయెందుకు జవ్హారాఖ్యునకు శ్రేయమ్మిమ్ము భూయమ్ముగన్

ఇంతటిదాకనీకు శ్రమనిచ్చితి బొక్కెడుమంచినీళ్లు నా
యంతటివాఁడొసంగఁ బరిహాసమగున్ జగదేకనాథ ! ప్రొ
ద్దంతయు నీవుమాకొఱకునై సమయమ్మునొసంగినావు మే
మెంతగనో ఋణస్థులము పృథ్వినితథ్యమునీకు నీశ్వరా !

పృచ్ఛింతున్ దమసన్నిధానమునమాహిందూ మహీచక్రముల్
స్వేచ్ఛాశాంత్యనిలమ్ముఁ బ్రాకిన మహాసీమన్ గనుంగొన్న వృ
క్షచ్ఛాయన్నివసించు పేదలు బుభుక్షజ్వాల సల్లాడుచో
సచ్ఛాంతస్ఫూర్తులెచ్చటం బోయెనే? స్వామీ! విచారింపగన్

## పర్జన్యము

ఒకడును కూడుగుడ్డకొఱకుర్వర బాధభరింపరాదు పై
సకలకళాప్రసూనములు జక్కగపూచి నిసర్గవాసనల్
ప్రకటితమై సెలంగవలె భక్తియుఁ గమ్రవినమ్రభావముల్
నికషపు ప్రాయమున్ జగతినింపు, నిలింపులు సబ్బురంపడన్

ఆగమశాస్త్రముల్ జదివినట్టిమనుష్యుడతండు స్వామి! నీ
యాగమనమ్ముఁగాంచిహృదయమ్ముప్రకంపమునొందఁ బ్రక్కగా
దాగొనినాడు శాస్త్రముల ధర్మములీతనికిన్ రుచింపవీ
లాగుననున్న ధర్మముపలాయనముం బొనరింపదా? ప్రభూ !

ఏదేశమ్మునసైనఁ కల్మికిఁ గడున్ హెచ్చైనస్థానమ్ము మ
ర్యాదల్ పూజనముల్ ఘటించునెడనయ్యా! శీలసంపత్తికిన్
ఏదారుల్ పొసగున్ సృజించితివి నీవీసృష్టినిట్లైనచో
నీదివ్యాశయమిందు దెబ్బతినుతండ్రి! యిందుకేమందువో?

క్లిశితమనస్సుఁగల్గిన పకీరతడాతడమాయకుండు వా
డశనములేక రోగమునకగ్గలమయ్యెను పేర్మితోడనే
దశబలుడైనదేశమునఁ దార్కొని మార్కొనుకాటకాలనే
దిశకుమఱల్చి నీవలపు దీవనలిమ్ము స్వజన్మభూమికిన్

కాకికి యెంగిలి మెతుకుల
నేకరముననైనఁ బెట్టకీతఁడు విశ్వ
శ్రీకారమ్ములఁ గోరెడి
పోకిల్లోపినిఁ గంటఁజూడుమ ప్రభువా!

రుణమ్ములందుఁ బరమేశ్వర! నీసెలవైనచోఁ గళా
లు చెప్పలేకనుభవించెడి దుర్భరజీవితాలు, వా
ముఁజేయఁగాబడిన దాతలయీవులవంచనాల గ
త్తులఁజెప్పసిగ్గగును మార్చుమువారిని మంచిత్రోవకున్

బ్రహ్మహితైషియైన జవహరులక్ష్యంపు
పంచశీల వజ్రబంధనమ్ము
పొల్పుమీఱబ్రహ్మ కల్పాంతమున దాకఁ
దనరునట్లుఁ జేయుమనఘ చరిత!

గాపాత్రముఁ జేతబూనియదె యావీధిన్ గడున్ దీనతన్
ంఫన్ దిరుగాడు మానవుడు క్షుత్పీడన్ వ్యధీయాంశమీ
ఖండితనికేది దిక్కగును పృథ్విన్నిత్యమిట్లైననీ
నాదక్షత లే, ముఖాయుగుజగద్రక్షా! కటాక్షించుమీ.

పర్జన్యము

దొరలయి సౌఖ్యవీచికలదోగెడు కొందరుదొంగలై నిరం
తరము తపస్సుఁజేయు జడదాసులమాదిరిఁ గానిపింతురీ
భరతవసుంధరాస్థలిని పాపము! వీరునిరోధశక్తులం
చెఱుగరమాయక ప్రజలిసీ! సమయింపుము దుష్టశక్తులన్

పట్టువస్త్రాలు ధరియించి పగటివేష
గాని చందానడాబు దర్పాన ఠీవి
గా షికారుకేగును మొనగానివోలె
చెప్ప దేశాని కీతడు చేదుమొక్క

కడుపుచించిన నొక్కయక్షరమురాని
భత్యమున్నట్టి కపటసాహిత్యవేత్త
పండితబ్రువులెల్లరు భజనసేతు
రతని యధ్యక్షపదవికి నడుసముంది

నిజముగ నేలుకొన్న ధరణీవలయంబగుచో స్వదేశమం
దిజములగోల యేల? పరివృద్ధినొసంగనివాక్కులేల? యీ
గజిబిజి యేల? వర్గముల గందరగోళము లేల? బువ్వకై
గిజగిజలాడు పేల పరికెంపగ మీసలుదువ్వు టేలనో?

నిలువంబెట్టితినిన్ను నింతదనుకన్నే నింత మాట్లాడగఁ
సెలవిప్పించిన నీసుహృత్తునకు జేజేలిత్తు మన్నింపవే
కలవెన్నో విషయాలుఁ జెప్పగ జగత్కల్యాణసంధాత! ఆ
వల నీచిత్తము రెండుమాటలను చెప్పన్బూనితిన్విన్న చో

అలముకొన్నవి భారతాకాశమునను ద
గ్రిపుమతోన్మాద మేఘాలగుంపు

చొచ్చుకొన్నవి నిజక్షోణీపిచండాన
కులమన్న నుక్కుకత్తుల వ్రజమ్ము

గుచ్చుకొన్నవి మాతృకుంభినీ శిరముపై
నిఱుపేదహృదయాల మొఱలముళ్లు

తగులుకొన్నవి స్వీయజగతి పాదాలకు
నిగిడాపు దారిద్ర్యనిగళయుగము

ధ్యానమగ్నులైన మహానింద్రజాతికి
పుట్టుచోటు భరతపుణ్యభూమి
నిట్టిదీనదశకు నెట్టకఁ గాపాడ
ప్రభువ! నీకు విన్నపమ్ము సేతు

## పర్జన్యము

తలచినాడు స్వరాజ్యధామాన ప్రతివాడు
శాంతిదాంతుల నివాసంబొనర్ప

వలచినాడు సమస్తవసుమతీ భాగమ్ము
నిస్తులంబగు ప్రేమ విస్తరింప

పిలిచినాడు జనాంగముల దివ్యకంఠాన
టకటొంకు లేని పాఠాలు నేర్ప

కొలిచినాడు దిగంతములు మెచ్చ ప్రథమాంధ్ర
భాగస్తులను వారివాడలోన

మలచినాడు శిల్పివలెను నిద్రాణమౌ
భరతజాతి నిదురమఱపుఁ దట్టి
ఖదరుమౌని గాంధి ఘనకీర్తిఁ గలవానిఁ
గన్న భూమి నీవు కావుమయ్య!

నాతండ్రి! తిలకించుమీ జగతి సత్యాస్త్రాల పోటీలలో
గోతుల్ ద్రవ్వకొసన్ మహామదపు శేస్గుల్ వోలె ఢీకొంటిరి
ఛాత్రశ్రేణుల గుండెలన్ని ప్రిదుల్లై పోవంగ సామ్రాజ్యకాం
డాతాప్ప్వ్యసబద్ధమానసులు రక్షాబంధమున్ గట్టవే?

# పర్జన్యము

ఎటుఁజూడఁగన్ ధనమే ప్రధానమయిపోయెన్ ధర్మమార్గాని కి
చ్చటఁ దావింతయు లేదు సత్కళల కాస్కారమ్ము శూన్యమ్ము,ము
చ్చటకైనన్ బరికింపఁ బోనమిట సౌజన్యమ్ము దౌర్జన్యమి
చ్చట తైతక్కలానర్చెబో ప్రళయపర్జన్యమ్ము రప్పింతువా?

బంధుపక్షపాత భావాలు గీవాలు
పనికిరావటంచు పలుకు దొరకు
గుండెలోన బంధువుండు కన్పడుఁగాని
వానికొలముఁగాని వానిఁగనడు

ఎందుకు మానవాకృతిని నీవనిసృష్టి నొనర్చితో చిదా
నంద యెఱుంగఁగోరెద ననంతవిపత్తులమున్న వీనికా
నందమయ ప్రపంచము కనంబడునే? గిలిగింత పెట్టునే?
ఇందు రహస్యమేమయిన నించుకనున్న దెరా! పరాత్పరా!

లుబ్ధాగ్రేసర సార్వభౌమునకు దయాభూ! వాఁడపభ్రంశపుణ్
శబ్దాల్వ్యాకరణమ్ము ద్రవ్యమెటులో సంపాదనఁజేయు, వా
డష్టైశ్వర్యముల్ గణియించబోఁడు దరిద్రానీకముం గాంచుచో
నష్టిన్ బోలె ద్వేషించువానిమునసయ్యా ! న్యాయమింతేనయా?

## పర్జన్యము

కవిగాఁబుట్టఁగరాదు పుట్టినఁద్రిలింగక్షోణి మధ్యమ్మున
ద్భవమందంగనుగ్గాదు జాతులకు ముద్రల్ వేయుదేశాన, స
త్కవికిఁ బువ్విడుగౌరవమ్ము కలదే? తాఁగుణ్యలావణ్యపుఁ
గవనంబున్ రచియించువానిబ్రదుకన్నా; దుర్భరంబయ్యెడిన్

వినుచూడకపోవచ్చు గాని యెప్పు
డైన భువనముక్రుంగి క్రిందైనశించు
ననుతలంపు నాకున్నది యఁమగనాథ!
చివరగా నాదొకమాటగా సెప్పికొందు

నాహిందూభువనప్రశస్తి పుడమిఁ రాణించి, బాపూజీ స
త్యాహింసా పరిణద్ధసూత్రవితతుల్ వ్యాపించి సద్దిక్కులఁ
బాహాటమ్ముగ ప్రేమశాంత్యనిలముల్ బర్వఁ బురాజ్ఞాసపుఁ
మాహాత్మ్యమ్ము సముద్ధరింపుమిచటన్ మాంపాహి విశ్వేశ్వరా!

---

కాకినాడ : జార్జిప్రెస్ యందు ముద్రింపఁబడియె.